# స్వతంత్రం

(బానిసత్వం తరువాయి)

2వ భాగం.

శ్రీ జంపన చంద్రశేఖరరావు

ఎం. ఏ., బి. ఇడి.

ఏలూరు.

3

ఒక చక్కనికుంచె, ఎఱ్ఱరంగుతో రకరకాల బొమ్మలు వేస్తూంది ఆకాశపు తూర్పు భాగంపై. ఆకుంచె ధరించేచిత్రకారుడు అందరకూ కనబడకపోయినా, అతని చిత్రాలు మాత్రం అంగచందాలు దిద్దుతూ, అందరి కన్నులకు వందుగ చేకూరుస్తూ ఉంటాయ్. ఆ చిత్రాలకెలా ప్రాణప్రతిష్ఠ చేసాడో, ఎలా నవజీవనం పోసాడో కాని, ప్రతి బొమ్మా మాట్లాడుతుంది పక్షులతో, ప్రాణులతో, రసజ్ఞులతో... ప్రతిప్రాణిని మేలుకొల్పుతాయ్ ఆ బొమ్మలు...

ఆ తెల్లవారుజామున ఉన్నా ప్రశాంతి, చైతన్యవైభవం ఇంకెపుడూ ఉండదు. ప్రతి చెట్టూ మేల్కొంటుంది. కొమ్మలనే హస్తాలతో, ఆకులనేవిసనకఱ్ఱలు తీసుకొని, అలసిపోయే ప్రాణికోటికి హాయికలిగిద్దామని విసురుతూ ఉంటుంది. ప్రతి పిట్టా పాడుకుంటూ లోకాన్ని మేలుకొల్పుతుంది.

లోకం మేలుకుంటుంది.

కాని—

మన రావన్న రోజూ మేలుకొని తోటపని చేసుకునేవాడు. ఆ రోజెందుకో మేలుకోలేదు. మేలుకోవాలనుకున్నాడు, కాని మూతలుపడిన కళ్ళు తెరువబడలేదు.

చింతచెట్టుక్రింద నులకమంచం వేసుకొని అలాగే నిదరపోతున్నాడు.

నిర్మల తెల్లవారుజామునే తోటలోనికి వచ్చి రావన్నను చూచింది. రావన్న మంచంమీద ప్రేమతో కూర్చుంది.

"రా...మం."

"......"

"తెల్లవారింది."

అతడు ముసుగు తీయలేదు.

"రామం! తెల్లవారిందోయ్!"

"అవును. తెల్లవారింది_నాకు గాదు; లోకానికి."

ముసుగులోనుంచే జవాబు చెప్పాడు. ఆమె ముసుగు తీసింది.

"రామం! నీవు లోకంలో వాడివికావా?"

అతడు కళ్ళు తెరిచి చూచాడు.

"నిర్మలా! నేను లోకంలోనే ఉన్నాను." తిరుగుతున్నా. జీవంతో ఉన్నవానిగాకాదు; జీవచ్ఛవంగా.

'ఏం మాటలు రామం!'

నిర్మలా! ఇండియా గొప్పదేశమే; ప్రజలు మాత్రం పేదవారు. ధనికులు కష్టజీవులైన కర్షక కార్మికులను దరిద్రులను చేస్తున్నారు. చేసి ఆ దరిద్రులను మానవులుగా పరిగణించడం లేదు. షూరి చెప్పులకింద పడి చిదికిపోయే చిల్లపెంకుల్లా చూస్తున్నారు వారిని.

రామం! ప్రతి ధనికుడూ దరిద్రులను జీవచ్ఛవాల క్రింద చూస్తాడనుకోకు.

"తాను ధనికుడని మరచిపోయే వరకూ చూస్తాడు."

'ఒప్పుకుంటావా ?'

'తప్పక'

"నేనూ అలా మరచిపోయాననుకో. అప్పుడు

అప్పుడు నీవూ నేనూ ఒకటే.

అలా దోవకు రా!

"అయినా నిర్మలా! నీ హృదయంలో ఉన్న నన్ను, నాహృదయంలో ఉన్న నిన్ను ఎవరు తుడిచివేయగలరు ?"

"ఎవ్వరూ తుడిచివేయలేరు."

'ఎవరు చెరిపివేయగలరు ?'

"ఎవ్వరూ చెరిపివేయలేరు."

"అయితే ఇంకేం—మనం—"

'శాశ్వతం...'

"ఉండొచ్చు నన్నమాట."

"కలిసి ఉండొచ్చు"

"సత్యం."

"సత్యంగానే."

అతడు చేయి చాచాడు. ఆమె అతని చేతులో ఒట్టు వేసింది. అతడు మంచం మీదనుంచి ఒక్క దూకు

దూకాడు. తోటలోనికి వెళ్ళాడు. వికసిస్తూ వికసిస్తూ ఉన్న గులాబీ పువ్వొకటి కోశాడు. పరుగు పరుగున నిర్మ లవద్దకు వెళ్ళాడు.

ఆమె నవ్వుతూ, కళ్ళతో కోదుతూ, నిలబడింది.

'నిర్మలా!'

"రామం!"

"ఇంక మనం శాశ్వతం కలసిఉండటమేకదూ!"

"తప్పక."

"అయితే ఇదిగో."

"నాకివ్వడం ఎందుకు నీవే—"

"తలలో..."

"పెట్టు రామం"

ఆమె తలలో విడుతూ విడుతూ ఆపుష్పం పెట్టాడు. ఆమె రెండుకళ్ళూ రెండుజ్యోతిల్లా వెలిగిపోతున్నాయ్.

ఆ నూతన ప్రియులను దంపతులను చేయాలని చూస్తుందా వనలక్ష్మి అన్నట్లు ప్రతిపూవూ వికసించింది.

ప్రేమీప్రేమకుల ప్రణయగ్రంథం తోటల్లో తొలుత ప్రారంభిస్తుందని ఆస్కార్ వైల్డ్ (Oscar wilde) చెప్పినట్లు, వారి ప్రణయగ్రంథం ఆ తోటలోనే మొదట అక్షరాలు చిత్రించుకుంది.

"రామం! ఇంకాలేవలేదే"

'లేచాను. ముఖంకడుక్కున్నా. మళ్లీ ఎందుకో పడుకుండి పోయా."

"హృదయం బరువెక్కిందికదూ! అంచేత పడుకుండి పోయావనుకుంటా'

"అంతే. అంతే."

వారిద్దరూ చేయీచేయీ కలించి తోటలో తిరుగుతూన్నారు. మంచుబిందువులుపడ్డా మల్లి మొగ్గ లేతసూర్యుని బంగారుకాంతిలో తళతళా మెరిసిపోతూంది.

నిర్మలహృదయం ఆనందపులకాంకురితం అవుతూంది. కాని రావన్న హృనయంమాత్రం అనుక్షణం ఎందుకో శంకిస్తూంది. అది కనిపెట్టింది నిర్మల.

"రామం! ఏదో ఆలోజిస్తూ ఉన్నట్లున్నావే."

"ఏమీలేదులే'

'చెప్పవ్! నాదగ్గరే దాపరకమా!'

'దాపరకానికికాదుగాని నిర్మలా! భగవానుడు అమరగానాన్ని వెలువరిచే అమృతవీణ నిచ్చాడు. తీగలు తెంపిపాట పాడమంటాడేమో!'

"ఎన్నటికీ అనడు. అందాన్ని నిర్మించటం, ఆనందాన్ని కలుగజేయడమే ఆయనవాంఛ."

"చక్కని పూలతోటనిచ్చాడు. పూలుకోయబోతే చేతులు నరికివేస్తేడేమో!'

'కోయబోయే పాతకి ఎందుకొంతాడు."

'ఎందుకుమరి నాగుండె ఇలాకొట్టుకుంటుంది.

"అదినీ దౌర్బల్యంబే'

'అంతే నంటావా?'

"ముమ్మాటికి"

'మీనాన్న, అమ్మా, అన్నయ్యా అంతా కలిసినన్ను పెళ్లిచేసుకోవద్దంటే'

'మానాన్నా?'

'మానవా?'

'నాపెళ్ళికి వాళ్లెవరు రామం? పెళ్లిచేసుకొనేది నేను గాని- వాళ్ళుకారుగా. కాపురం చేసేది నేనుగాని- వాళ్లు కారుగా. ఇవి నాసుఖానికి గాని- వారిసుఖానికి కాదుగా—'

"చివరివరకూ వారిని ఎదిరించడానికి నీకు శక్తి ఉందా అని నాసంశయం."

"చూస్తావుగా.'

"వాళ్ళిద్దరూ ఆనందంలో సృష్టినే మరచిపోతూ ఉన్నారు.

అంతలో కోటమ్మ "నిర్మలా! నిర్మలా!"
అంటూ పిలుస్తూ వచ్చింది- పానకంలో పుడకలా— నిర్మల తబ్బిబ్బుపడింది.

"ఏం నిర్మలా! అలా బెదరిపోతున్నావ్!

'ఏమీలేదు.'

"లేకపోవడం ఏమిటి? నీకళ్లు నాకు చెప్పడంలేదూ"

"ఈ కోటి మనల్ని చూసిందా?"

'చూస్తే"

"అబ్బే! ఏమీలేదు- ఇంట్లో చెబుతుందేమోనని."

'భయపడుతున్నావా?,

'భయంకాదనుకో...అసలు చూసిందా అని—

'నిర్మలా! నాదగ్గర నీహృదయం దాయగలవా? కోటమ్మ ఇంట్లో చెబుతుందేమో అనుకొనేసరికే వణికిపోతున్నావే- ఇంక ఆమె ఇంట్లో చెప్పి- మీనాన్నగారిచేతే అడిగిస్తే, ఇంకేముంది? ఈరావన్నపని అల్లికిఅల్లి, సున్నకు సున్నేకదా!"

'ఎన్నటికీ కాదు—'

"కాదేమిటి? మీగొప్పవారి మనసులు నాకు తెలియవా?"

"ఎన్నడూ తెలియవు" అంటూ కోటమ్మ వచ్చింది.

'ఏం కోటీ ఇలాగొచ్చావ్!'

"నాన్నగారు అర్జంటుగా రమ్మన్నారు."

"ఎందుకు?"

'పెళ్ళిచూపులు చూడ్డానికి ఎవరో వస్తున్నారట... నిన్ను సిద్ధంగా ఉండమన్నారు"

"ఎందుకు?"

"ఎవరు? నాన్నే"

"ఆఁ!"

ఆమె మాటలాడకుండా తలవంచుకొని నిలబడింది.

'నిర్మలా! ఎందుకాలోచన, వెళ్ళిరా. ఆత్మబలం ఉంటే అనుకున్నపని చేయగలవు. లేకపోతే సంఘం అడకత్తెరలో పోకచెక్క వవుతావు. అంతే. ఈ రెండింటిలో ఒకటి తప్పదు' అని రావన్న అంటూ ఉంటే అతని గొంతుకు ఎవరో బిగపట్టి నట్లయింది.

నిర్మల కోటమ్మ వంక చూచింది.

"కోటీ! నివ్వు వెళ్ళు. తరువాత వస్తానని చెప్పు"

"రావడానికి ఆలస్యం ఎందుకు నిర్మలా!" రా. వచ్చి నీ భావరుడు నచ్చితే చేసుకుంటానను. నచ్చకపోతే చేసుకో నను. బలవంతంగా ఎవర్నీ ఎవరూ కట్టిపెట్టలేరుకదా! ఆత్మ "స్వాతంత్ర్యం కంటే ఉన్నత స్వాతంత్ర్యం మరొకటి ఉండదు"

కోటమ్మ మాటలువిన్న నిర్మల నిలువునా నీరయి పోయింది.

"అబ్బా! ఈ పేదవాళ్ళల్లో ఎంత ఆత్మశక్తి ఉంది" అనుకుంటూ, "రామం! ఇప్పుడే వస్తాను' అని చెబుతూ చర చరా వెళ్ళిపోయింది.

'ఎప్పటి కేదో!

అనుకుంటూ తన పనిలోకి వెళ్ళిపోయాడు రావన్న. వీ ళ్ళిద్దరి చిత్తప్రవృత్తులు అర్థంగాక అయోమయా ప్రపంచ ములో పడిపోయింది కోటమ్మ.

---

# ౭

భద్రం కోటీశ్వరుని కొడుకు. కోటీశ్వరుని ఇంటిలో పెరిగాడు. కాని అతని భావాలన్నీ పేదవాళ్ళవే, అతని ఆత్మ సంచరించేది కూలీల పాకల్లోనే.

ధనికుల నతడు ద్వేషించడు; కాని దరిద్రులంటే ప్రేమ ఎక్కువ. ఉద్యోగస్థుల నతడు ద్వేషించడు;కాని ఉద్యోగాన్ని చాలా ద్వేషిస్తాడు. ఆంగ్లేయ పరిపాలనా విధానాన్ని ఖండిస్తాడు; కాని ఆంగ్లేయులంటే అతనికి చెప్పలేనంత అనురాగం. తల్లిదండ్రులు చేసే అన్యాయాలను, అక్రమాలను ఎదుర్కుంటాడు. కాని తల్లితండ్రులంటే చెప్పలేనంత భక్తి.

భద్రం అంటే ప్రజలకు పంచప్రాణాలు, తండ్రిగారి బ్రహ్మానికి కారాలు మిరియాలు—

కోటమ్మ పాలు కప్పుతో పాలిచ్చింది. అతడు త్రాగుతూ ఆమె కళ్ళల్లోకి చూస్తూన్నాడు.

కోటీ, ఇలా తీయని పాలు నీచేతులతో ఎంత కాలం ఇస్తావో కదా!"

'అదేమిటి పెదబాబూ! అలాగంటున్నావు!"

"ఏమీలేదులే."

'మళ్ళీఏదో తలపెట్టావ్! నాన్నఏమన్నా అన్నాడా!

"ఆయనంటే నాకు బాధేలేదు.

"మరి?"

"ఒకవేళ నాఉపదేశాలు నచ్చని ప్రభుత్వం నన్ను శ్రీకృష్ణజన్మస్థానానికి పంపుతే.

అంతకంటే కావలసిందేముంది? నీవెంట ఆనందంగా నేను మ త్రిం రానూ?'

"నీవు రావాలన్నా నిన్ను హారెస్టుచేసేదెవరు"

'ఏం మగవారినేగాని ఆడవారిని అరెస్టుచెయ్యరా?

చేసేటంత ఘాటుగా ఉపన్యసించాలిగా.

'అంతేగాని 'నేనూ ఖయిదుకు వెడతాను.

అంటే ఖయిదులో పెట్టరన్నమాట'

అలాగైతే జరగని వాళ్ళంతా ఖయిదులు నింపరూ?

"అదా సంగతి'

మరేమనుకున్నావు! కోటీ ఒకవేళ అదృష్టవశాత్తు నన్ను హారస్టే చేశారనుకో. అప్పుడు నాన్న నిన్ను చాలా బాధ పెడతారేమో!'

"నీవక్కడనుభవించే బాధకంటే నేనిక్కడనుభవించే బాధ ఎక్కువా పెదబాబూ! అయినా నీవు చెప్పినట్లు బాధ మనసు స్వాధీనంలో లేనివారిగ్గాని అందరికీ కాదుగా."

"చక్కగా చెప్పావ్! మన మనసే మన స్వాధీనం లోఉంటే లోకంలో బాధేలేదు. శత్రుత్వమే ఉండదు. జీవి

తంలో ఎత్తు పల్లాలే ఉండవు ఆ నాడే ఆనంద సుందర మందిర ప్రాంగణంలో అమరగాన సౌరవంతులు వెల్లివిరుస్తాయ్.

అయితే బాధపడవంటావ్.

"పడను:"

'ఇల్లోంచి పొమ్మంటే.'

"పోను"

"పోక ?"

"సత్యాగ్రహం చేస్తా."

"కొడితే"

"పడతా"

"లేనిపోని అపవాదు ఆరోపిస్తే."

'అనుభవిస్తా.'

"శభాష్ కోటీ-వేయికి నీవంటిది ఒక్కతె ఉంటే చాలు స్వతంత్ర పార్టీకి.'

అంటూ ముకు కప్పు చేతికిచ్చి, ముంగురులు నిమిరి 'కోటీ' అని గారాబంగా పిల్చి, బయటకు ఉషారుగా వెళ్ళిపోయాను.

కోటమ్మ ఒక నిట్టూర్పు పుచ్చి లోపలకు వెళ్ళిపోయింది.

♦ ♦ ♦ ♦ ♦

భద్రం కూలీల పాకలవైపు బయలుదేరాను. అంతలో

పదిమంది ఒక కుఱ్ఱవాడిని భుజంమీద మోసుకొస్తూ ఉన్నారు.

కుఱ్ఱవాడి తల నెత్తుటి మయం అయిపోయింది. నెత్తుటి బొట్లు తోవపొడుగునా జారిపోతూఉన్నాయ్.

భద్రం కళ్లు చెదిరిపోయాయ్. వెంటనే పరుగు పరుగున వాళ్ళదగ్గరకు వెళ్ళాడు. భద్రాన్ని చూడగానే నలుగురూ తప్పుకొని భద్రానికి చోటిచ్చారు.

అప్పన్నా ! ఏమైంది !

"ముసలి వెంకడు కన్నీళ్లు తుడుచుకొని ఇలా చెప్పాడు.

"బాబూ ! పొద్దుట ఇంజన్లో ఆయిలెయిబోతుంటే బెల్టుతగిలి టపేమని పడిపోనాడు. దానితో తల పగిలి పోనాది. ఏంటి చేయడం బాబూ ! అంతా కర్మ."

'కర్మా ! కర్మ. మంచికర్మే ?'

భద్ర ముఖం ఎఱ్ఱబడిపోయింది.

"అప్పన్నా ! ఇలా ఎందుకు తీసుకొచ్చారు ?"

"ఇక్కడికాకపోతే ఎక్కడికి తీసకెళ్ళేది ?"

"హాసుపత్రిలేదూ ?"

"అక్కడంతా గొప్పోళ్ళేకానీ, బీదోళ్ళని సూడ్నే సూడర్రిండి."

"అది గొప్పవాళ్ళకొరకు కాదోయ్ కట్టింది, పేద వాళ్ళ కొరకే. అవ ధర్మాసుపత్రి."

'పేరుకంతేనండి...అక్కడ డాక్టర్లు ప్రతివోడు దగ్గిరా డబ్బు గుంజడమే కాని జబ్బు మాన్పడం నేదండి.'

"డబ్బు ఇవ్వకపోతే ఏంచేస్తారు!"

"మందుకు మారు మంచినీళ్ళిత్తారండి. దానితో సావాల్సిందే."

'అప్పన్నా! ఒక్కమాట చెబుతా విను.'

నీ దొడ్లో ఒక మామిడిచెట్టు వేసి, కష్టపడి నీళ్ళు పోసి, పెంచి, పెద్దదాన్ని చేశావనుకో. ఆ చెట్టునిండా కాయలు విరగకాశాయ్ అనుకో... ఆ కాయలు పరాయి వాడొచ్చి కోసుకు పోతాడనుకో. నీవేం చేస్తావ్?

'వాడి పిక్కలు ఇరగబొడుస్తా.'

'అలాగే మీ డబ్బుచేత, మీ కొరకు కట్టిన హాసుపత్రిలో మీకే మందుల్లేకంటే అర్థం ఉందా? మనం డాక్టర్లను మంచి మందు ఇమ్మనాలి. ఇవ్వకపోతే ప్రభుత్వానికి తెలియపరచాలి మనల్ని డబ్బు అడిగితే వాళ్ళని పట్టి ప్రభుత్వం వారికి ఒప్పగించాలి. మన హక్కులు మనం వదులుకోరాదు."

"చిత్రం."

'మీరంతా ఆ అబ్బాయిని తీసుకొని హాసుపత్రికిరండి. నేను డాక్టర్లతో మాట్లాడి చక్కని మందులిప్పించి బాగుచేయిస్తా...లేవండి...అటు పదండి.'

'భద్రం ఆమాటలంటూ వాడిని హాస్పత్రికి తీసుకువెళ్ళాడు. డాక్టర్గారు చూస్తూనే కట్లు కట్టించాడు.

"మరో అరగంట ఆలస్యం అయితే ప్రాణంపోయేదే" అన్నాడు డాక్టర్.

దెబ్బతిన్న సోమన్న ప్రాణం రక్షించిన భద్రం కాళ్ళమీద పడి 'బాబూ! మా అబ్బాయి నిండు పానా లీపాటికి పోయేయి. రచ్చించావ్ బాబూ! రచ్చించావ్' అని అప్పన్న కన్నీళ్ళు కారుతూ ఉంటే గొల్లుమన్నాడు.

సోమన్నకు వచ్చిన భయం ఏమీ లేదని డాక్టర్లు చెప్పాక ఎవరింటికి వారు బయలుదేరారు. వాళ్ళతో భద్రంకూడా బయలుదేరాడు. అంతా చెరువుదగ్గరకు వెళ్ళి ముఖాలు కడుక్కొని, చెరువుపక్కనున్న మర్రిచెట్టుకింద కూర్చున్నారు.

భద్రంకూడా వాళ్ళతో కలిసి కూర్చున్నాడు. ఇంతకూ సోమన్నకు భద్రంతండ్రి రాంబ్రహ్మంగారి మిల్లులోనే తలపగిలింది. రాంబ్రహ్మం రాలేదు. అతనికి దెబ్బతగిలిందని విచారించలేదు. కాని కుమారుడుమాత్రం విచారించాడు. తగిన సాయంచేశాడు. తండ్రికొడుకుల కెంత భేదం ఉంది.

"గవరన్నా! ఇలా దెబ్బతగిలినందుకు మానాన్నేమీ విచారించలేదూ?

భద్రం ప్రశ్నకు గవరన్నకు నవ్వువచ్చింది.

"పెదబాబూ! దెబ్బతగిలింది మాకయితే, విచారం ఆయన కెందుకండి!"

'మీరంతా ఆయన పనివాళ్ళేగా"

"పనివాళ్ళమే. అందుకే కూలిడబ్బు లిస్తున్నారు. దాని వల్లే మేం బ్రతుకుతున్నాం."

"ఆయన కూలి డబ్బులీయకపోతే చచ్చిపోతారా!"

"తప్పక."

"అదేమిటోయ్, ఈకష్టం మరోచోటచేస్తే డబ్బు రాదూ?"

"ఎందుకొస్తుదండీ? ఇంతమంది నెవరు పోషించగలరు? ఇంతమందికి పని ఎక్కడుంది? పెదబాబూ! పనిచేస్తామన్నా చేయించుకొనే వారుండాలి.'

'ఊహూఁ!"

గవరన్న వాళ్ళల్లో శాస్త్ర చదువుకున్నవాడు. అతని కూడా స్వతంత్ర భావాలు కలగినందుకు భద్రం వాశ్చర్య పోతున్నాడు.

అంతలో ఎఱ్ఱయ్య లేచి భద్రం దగ్గరకొచ్చి నిలబడి ఇలా ప్రారంభించాడు.

"పెదబాబూ! మా తల రాతకు మీనాన్నగారేటి సేత్తారండీ?"

"సాయం చేస్తారు."

"అదేటండీ మా కర్మకిలా ఏడవాలనంటే ఆయనేటి సేత్తాడండీ! నవ్వెత్తాఢా?

'ఎఱ్ఱియ్యా! 'కర్మ' అంటే 'పని' ఎవరి కర్మ ఫలితం వాళ్లు అనుభవించవలసిందే. కాదనను. కాని మీ కర్మ వల్ల దెబ్బతగిలితే అతని కర్మ వల్ల మీకు సాయం రావొద్దూ...పిచ్చివాడా? ప్రతీది మన పూర్వజన్మ కర్మమీద తోసివేయకూడదు. మీరిలా ప్రతిపనీ కర్మమీద తోసి వేస్తే ఇంతకంటే అధఃపతితులౌతారు."

"బాబూ! మా కర్మ కాపోతే మేం ఎందుకిలా పేదత్వం అనుభవిస్తాం."

'ఎఱ్ఱియ్యా! మీరు పేదవాళ్ళు కాలేదు. మిమ్మల్ని పేదవాళ్ళుగా చేశారు.'

'ఎవరండీ.'

"మహానాసన వంటి కోటీశ్వరులు"

'అదేటండీ.'

'ఎఱ్ఱియ్యా! మీకిచ్చే కూలి 3 పావలాలు. మీమీద వచ్చే ఆదాయం మూడు రూపాయలు ఒక్కొక్కని మీదా రోజుకు రెండు రూపాయిలు మిగుల్తుంది. అంటే రెండువేల కూలీలమీదా నాలుగువేల రూపాయిలు రోజుకు 'మిల్లు ఒనరుకు' వస్తుంది. ఆ నాలుగువేల రూపాయిలు మరనాడు మరో నాలుగువేల మందికి పైగా పంచాడనుకో. వారి మీద. మరో ఎనిమిదివేలరూపాయిలు ఒక్కరోజులోనే రాలేదూ... ఇలా మీమీద వచ్చిన నాలుగువేలూ, వాళ్ళమీద వచ్చిన ఎనిమిదివేలూ కలిపితే పన్నెండువేలు వస్తాయికదూ! అవన్నీ

డు వేలమీఁదా మరో పన్నెండు వేల రూపాయిలు లాభం ఉంటుంది. అలా మీ కూలీల మీఁద వచ్చే ఆదాయంవల్ల వాళ్లు కోటీశ్వరులౌతున్నారు. మీరో మీ [illegible] కూడా చాలని దుర్భరస్థితిలో ఉన్నారు. ఏనాడైనా మీరు గొప్ప వాళ్ళవడానికి ఆస్కారం ఉందా? మీరీ జీతాలతోనే ఉంటే మీ పాకలెప్పుడైనా పెంకుటిళ్లు కాగలవా? మీరేనాడైనా మూడు పూటలా కడుపునిండా భోజనం చేయగలరా?

ఎర్రియ్యా! మీరు పేదవాళ్లగా పుట్టలేదోయ్. మిమ్మల్ని గొప్పవారు పేదవాళ్లగా చేశారు. వాళ్లకే మీరు దాసోహం చేస్తానంటే ఎలా? మీ కళ్ళు మీ చేతులతోనే మూసుకొని లోకం అంతా చీకటైపోయిందంటే ఎలా? మీ తలపై అజ్ఞానం అనే ముసుగు వేసుకొని, ఆ చీకటిలో కుళ్ళిపోతూ ఎంతకాలం జ్ఞానభానూదయం చూడకుండా ఉంటారు?

సుబ్బన్నా! మీ గుండెలు పరచి ఎంతకాలం ఈ స్వార్థ లోకాన్ని నడిపిస్తారు? దయాదాక్షిణ్యాలు, కరుణా వాత్సల్యాలు లేని ఈ నరహంతకుల కెంతకాలం జోహారులర్పిస్తారు? ఎంత కాలం తిండితిప్పలు పెట్టలేక మీ మీ బిడ్డలను చంపుకుంటారు?

ఏడుకొండలూ! వింటున్నావా? లోకంలో సామ్రాజ్యాన్ని కంటున్నావా? అనుగమనమనకూ అనుకర్షణాలిస్తూ, అనుగ

దుగునా ప్రాణాలర్పిస్తూ ఎంతకాలం మీఆశలు రాల్చుకుంటారు? ఎంతకాలం మీఅసువులు జార్చుకుంటారు?

చస్తే దహనానికికూడా డబ్బులేని దౌర్భాగ్యం— చస్తేసమాధులుకూడా నిర్మించుకోలేని అభాగ్యం, మీచేతులారా మీరే తెచ్చుకుంటున్నారు సుమా! పూలబాటవిడచి ముళ్లకంచల్లో ప్రయాణం చేస్తున్నారు.

అయ్యయ్యో! అలా ఆకూలిపోతూ కూలిపోతూ, ఉన్న పాకలు చూడండీ! అలా తిండిలేక బక్క-చిక్కిన మీ మీబిడ్డల వాడిపోయిన ముఖాలుచూడండీ! వంటినిండా బట్ట లేక సిగ్గుతో కుంచుకుపోయే మీభార్యా బిడ్డల వాడిపోయిన కళ్లుచూడండీ! గుండెలు తరిగిపోవడంలేదూ! తందనాలు తొక్కడం లేదూ!

బాబూ! కన్నీళ్ళెందుకు పెడతావోయ్! కార్యశూరుడవు కానాయనా! అలా చూడూ! ఆ భాగ్యవంతుల మేడ మిద్దెలు. ఇలా చూడూ ఈ అభాగ్య జీవుల కూలిపోయే తాటాకు కొంపలు...

అంతా ఒకలాగ పుట్టామే, ఈవిభేదాలకు కారణం ఊహించరే...లేచి ప్రపంచంవంక తేరిజూడరే...మీదరిద్ర దేవతను మీకొంపలనుండి తోసివేయరే— మంగళవాయిద్యాలతో, తూర్యనాదాలతో సౌభాగ్యలక్ష్మిని ఆహ్వానించరోరే—

అతని గొంతుకు బొంగురు పోయింది. కను లెరుపె క్కాయ్. మాటాడ లేపోతున్నాడు.

అంతలో ఒకవృద్ధుడు లేచి భద్రంముందు గంభీరంగా నిలబడ్డాడు. భద్రం అతనివంక జాలిగా చూస్తున్నాడు. అత డిలా ప్రారంభించాడు.

"భద్రంబాబయ్యా! మేం ఎప్పటికైనా గొప్పారుం కావచ్చునంటారా?"

"తప్పక.'

"ఎలాగవుతామండీ!

"ముందుమీరు పూర్వజన్మకర్మవల్ల పేదవాళ్లే పుట్టలే దనే ఆత్మవిశ్వాసం కలిగి ఉండండి. ఏనాడయితే మీకుఆత్మ స్వాతంత్ర్యం వస్తుందో ఆనాటినుంచే యుగయుగాలగా మి మ్మావరించుకొన్న బాసిన భావాలు పోతాయ్.

"అలాగటుండీ!"

"అంతేనోయ్! సూర్యుడుదయించేవరకే చీకట్లుండేది. సూర్యుడుదయించగానే చీకటి చెల్లా చెదురైపోతుంది"

"మాకర్మంతా ఆనాడోతుందాండీ!"

"మళ్లీ కర్మంటావు!"

మరేటన్నండీ!"

"కొంత కాలం 'కర్మ' అనే పదం పూర్తిగా మరచి పోండి.'

మరచిపోయి—"

చెప్పానుకదోయ్—స్వతంత్రం గురించి ప్రయత్నించండి. కానిస్వత్వం పారద్రోలండి. దానితో మీఆకలి దప్పు తీరిపోతాయ్.

ఆమాటలంటూ ఉండగానే ఒక సి. ఐడీ ఆఫీసరు, ఒక సబ్ ఇనిస్పెక్టరులేచి —

నీవు స్వతంత్రం గురించి వీళ్ళకు బోధిస్తున్నావుకాబట్టి నిన్ను అరెస్టు చేశాం" అని పట్టుకున్నారు.

భద్రం నవ్వుతూ ఆకూలీలవంక చూచాడు.

"చూచారా! స్వతంత్రం అనేమాట వచ్చేసరికి నాకు ఖుషీ. దానికేం... బాబూ! నేను అరెస్టు అవుతున్నందుకు విచారించను ఎందుకంటే మీకోరకు అరెస్టు అయ్యే దానికంటే నాకు ఆనందం ఏమీలేదు. మీగురించి నాప్రాణాలైనా అర్పిస్తా.

'చాల్లెగుండి. మీరువస్తే మాప్రాణాలు తీస్తారు. మీరు సావాహోద్దు, మాకోసం ఏడవావొద్దు. అసలు మీరు వెయ్యి దణ్ణాలు...

మీకర్మకొద్దీ మీరు కయిదు వెళుతుండి మాకోసం అంటారే"

ఆమాటలు వినేసరికి భద్రం హృదయం చిదికిపోయి నట్లయింది.

'ఎర్రియ్యా! నాఖయిదుకు విచారంచడంలేదోయ్. మీమూర్ఖత్వానికే విచారిస్తున్నాను. మీ కర్మసిద్ధాంతమే మిమ్మల్నీ దార్భాగ్యస్థితికి తీసుకువచ్చిందని ఎలా నచ్చచెప్పడం''

"ఏం సెప్పొద్దుగాని- మీ రెల్లండి''

"వెళ్లిమళ్ళివస్తా.'

"రాబోకునాయనా, మాలోఎవర్నినా పట్టుకోగలరు'

భద్రం ఇంకేమీ మాట్లాడలేపోయాడు. వారందరి వంకా ఒకసారిజాలిగా చూచాడు.కొందరు 'భద్రం బాబయ్యా' అని గోలపెట్టేరు. కొందరు వారిని వారించారు పోలీసులాయనను రమ్మని తొందరపెట్టారు.

'పదండి బాబూ! పదండి...'' అని పోలీసులతో చెప్పి, కూలీలవైపు తిరిగి "ముసలివాళ్ళకు ముసలి భావాలుంటం సహజం, పడుచువారికికూడా ముసలి భావాలేనా? పాపం ! మీకప్పుడే ముసలితనం వచ్చిందే. అందుకనేనా మీసమాధులు మీరు తవ్వుకు టున్నారు... కర్మంట కర్మ'' అంటూ పోలీసులవెనక బయలుదేరారు.

కూలీలలో గుసగుసలు బయలుదేరాయ్.

"ఆడికర్మకు మనవేటి సేత్తాంరా' అన్నాడొకడు చుట్టకు నిప్పంటిస్తూ-

'మనకోసం కాకపోతే ఎందుకు అట్టెట్టవుతుండాడురా! అన్నాడొకడు కోపంతో తలకుగుడ్డచుట్టుకుంటూ.

పోనిద్దూ! ఆడిగొడవ మనకేటికి?'' అన్నాడు ఇంటికి త్రోవతీస్తూ మరొకడు.

ఇలా అనేకరకాలవారు మాటాడుకుంటూ వారి పాకలు చేరారు.

మనభద్రం మాత్రం 'వాళ్ళ అజ్ఞానం బాపడము ఎలా?'' అంటూ ఖయిదులో ఆలోచిస్తున్నాడు. కుక్కతోక వంటి మూఢుల మనస్సు తిప్పడం ఎంతకష్టం!





## ౭

జీవితం ఒక ప్రవాహం వంటిది.

పొంగిందా అంటే మిన్నులు ముడుతుంది.

కృంగిందా అంటే చుక్కకూడా కనుపించకుండా ఇంకిపోతుంది.

ఏదివచ్చినా వైపరీత్యమే.

మహాత్ములీ ప్రవాహానికి ఆనకట్టలు కట్టి స్వాధీనం చేసుకుంటారు. సామాన్యులుదాని పెరుగు తరుగులు గమనిస్తూ సమయానుకూలంగా సంచరిస్తారు. అధములు దానిదోవను

దానినిపోనిస్తారు. పొంగినప్పుడు తేజం— పొంగనప్పుడు నిస్తేజం—



"భగవంతుడా! నేను తలంచే ప్రతితలంపూ ప్రజాభ్యుదయానికే తలంచనీయ్. నేను మాటాడే ప్రతిమాటా ప్రజావిజ్ఞానానికే మాటాడనీయ్—నేను చేసే ప్రతిపనీ ప్రజాసేవకే చెయ్యనియ్— నాజీవితాన్ని ప్రజలకే వినియోగించనీయ్. ఈస్వార్థసంఘంనన్ను ముక్కలు ముక్కలుచేయనియ్, నాకళ్ళు పెగిలించనీయ్; ఉరికంభానికి నానెత్తురు పారాయణ చేయనీయ్; ఉరితాళ్ళకి నానరాలు పెనవైచుకు పోనియ్; ఏమైనా కానియ్. నేను సిద్ధం. ఈ నాఆత్మవిశ్వాసాన్ని బలపరచుతండ్రీ! ఇంతకంటే నిన్ను అర్థించేదేమీ లేదు.

భగవాన్! నిష్కల్మషమైన నీసృష్టిని కల్మషభూయిష్టం చేసే స్వార్థపరుల నెదుర్కొంటానికి శక్తినియ్—నీ ప్రేమమయ ప్రపంచాన్ని స్వార్థభూయిష్టంచేసి చిల్లులు చిల్లులుగా పొడిచే చీడపురుగులగు ఆత్మజ్యోతిని చూపించటానికి శక్తినియ్— తండ్రీ! ఈనావేడి కన్నీటితోనే నీపాదాలెప్పుడూ కడుగుతూ ఉండనీయ్. లోకాలోకాల్ని పాలించే సత్యాన్నే చూడనివ్వ్. అంటూ భద్రం నిరంతరం ప్రార్థిస్తున్నాడు.

'భగవాన్! నిరుదులక్షరూపాయిలు లాభంవచ్చాయ్.

నీకు గుడి కట్టించాను. పేదలకు సత్రం కట్టించాను. నా పేరు అన్ని పేపర్లలో పడడం నీవు చూడలేదూ?

మొన్న నేనేగా 'వార్ ఫండ్' కు అయిదువేల రూపాయిలిచ్చాను. తిరనాళ్ళకు భోగంమేళం పెట్టి నిన్ను ఊరేగించాను. మొన్న మా ఊరిలో వచ్చిన స్వాములవారికి వెయ్యినూటపదహారులిచ్చాను. హరికథ చెప్పించి నూటపదహారు లిచ్చాను. ఇలా ఎన్నోవిధాల నీగొప్పతనాన్ని చాటుతున్నా భక్తుణ్ని, నామాటలు అబద్ధం అయితే ఈవిషయాలన్నీ పేపర్లలో చూడొచ్చు.

భగవాన్, ఈయేడు మరోలక్షలాభం చూపిస్తే నీకు బంగారపు పంగనామాలు చేయిస్తా. వెండికోడుగు తొడిగిస్తా, రత్నాల అడ్డబాస చేయిస్తా. వీలుంటే మరోగుడి మామేడ ముందుకట్టిస్తా. డబ్బిచ్చి బాగాపాడేవాళ్ళను పిలిపించి భజన చేయిస్తా. ఇంకా ఏంకావాలి. అంటూ భక్తిం తండ్రి రాం బ్రహ్మం పూజిస్తున్నాడు.

ఇటువంటి ఆతండ్రీకొడుకులెలా కలిసి ఉండగలరు? కలిసిఉంటే ఎంత కాలం కలిసి ఉండగలరు?

ఒకరు ప్రజలకు బలికావాలంటున్నాడు, మరొకడు ప్రజలను బలిచేస్తానంటున్నాడు. మొదటివానిని ప్రజలు విశ్వసించడంలేదు, రెండో వానిని ప్రజలు విశ్వసిస్తున్నారు.

ఇదీ లోకం.

ధర్మాధర్మాలీనాటికైనా తెలిసికోగలిగితే బంధవిముక్తి, లేకపోతే బంధనియుక్తి చేసుకున్నంతా మహాదేవ.



రాత్రి 10 గంటలయింది.

రాంబ్రహ్మం ఇంటిలో కారాలూ మిరియాలూ నూరుతున్నాడు. భద్రం తనభావాలకు [illegible] పనిస్తున్నాడనీ, కూలీలలో విప్లవజ్వాలలు రేకెత్తిస్తున్నాడనీ, [illegible] కాన్నంతా చిన్నపరుస్తున్నాడనీ, [illegible] అయ్యాడనీ నిశ్చయించుకొన్నాడు రాంబ్రహ్మం! భద్రాన్ని ఇనుపపంజరంలోనుంచి విడిపించే పనులన్నీ చేశాడు. విడిపించడం భద్రం మేలుకోరి కాదు, అతడిమేలు కోరుకొనే.

కొడుకు దుశ్చేష్టలన్నీ తలంచుకొని తోకత్రొక్కిన నల్లత్రాచులా సావిటిలో బుసలుకొడుతున్నాడు.

"వెధవ! నాకడుపున చెడపుట్టాడు. పుట్టినప్పుడే పురిటిసంధికొట్టి చావన్నా చచ్చాడుకాదు. "చెరపకురా చెడేవు' అన్నట్లు నన్ను చెరసాలనుకున్నా వెధవ చెడవకుండా ఉంటాడా? ఇప్పుడు దిక్కేస్వరయ్యాడు! నూతిమిడిసిపడ్డాడు.మన ఆటలా ప్రభుత్వం ముందా? పొట్టేలెళ్లి పర్వతాన్ని ఢీకొంటే నష్టం ఎవరికి?కొమ్ములు విరిగిలఅదే చస్తుందికాని, పర్వతానికేమైనా నష్టమా?' అంటూ "చిత్తంచిత్తం" అని చెప్పిందానికల్లా 'సిభాష్' అనే గుమాస్తాకు చెప్పాడు.

కానికోపం చల్లారలేదు.

మేడెక్కాడు.

కోటీ! కోటీ' అని కేకవేశాడు.

వస్తున్నా' నంటూకోటివచ్చి అతివినయంతో తన యెదుట నిలబడింది.

కోటీ!

గసురుగసిరేసరికి కోటిగడగడ లాడిపోయింది.

కోటీ, మాటాడవేం?"

బాబయ్యా!

వణుకుతూ జవాబిచ్చింది.

నిన్ను పెంచి పెద్దదానిని చేసిందెవరో తెలుసా?

తెలుసండి.

ఎవరు?

'మీరే కాదని ఎవరన్నారు?

భద్రంవంటె వెఱ్ఱివెధవ అంటేమాత్రం సాగుతుందా?

ఆయనెప్పుడూ అనలేదే!

అనకపోతే పోనీ- పెంచింది నేనేకదూ!

నిస్సంశయంగా...'

పెంచినవానిమాట వినాల్సిందే కదూ?

తప్పక, లేకపోతే పంచమహాపాపాలూ చుట్టుకోవూ?

వెధవ సిగ్గులు కట్టిపెట్టు

'అలాగే. వినేవారికి నీతులుగానీ, వీనని వారికెందుకు?
చాల్లే నోరుముయ్.
కోటి మాటలాడకుండా నిలబడింది.
అతనికి మరింతకోపం ఎక్కువైపోయింది.
ఏయ్! మాటాడవేం?
నోరుమూసి ఎలామాట్లాడను బాబయ్యా!

ఇదిగో- ఇటువంటి పెళసరం అయిన జవాబులునేర్చుకున్నావు వాడిదగ్గర.

చిత్తం.
సరే, నేనుచెప్పినట్లు చేస్తావుకదా?
చెప్పానుగా చేస్తానని.

అయితే తక్షణం నీమూటాముల్లీ కట్టుకొని నాఇంట్లోనుంచి వెళ్ళిపో.

నామూటాముల్లీ ఏముందండీ? "నా" అనేది నాకేమీ ఈప్రపంచంలో లేదుగా- ఏతల్లో తనపాపానికి చిహ్నంగా కనిపారవేసిన ఈపసికందుకు, ప్రాణంపోసి పెంచింది మీరు- నాసర్వస్వం మీదే. ఇంక నాదేముంది?

అయితే వెళ్ళిపో.
అలాగే

రెండు నిమషాలెవరూ మాటాడుకోలేదు. కోటమ్మ

మాత్రం అలాగే ఒక మూల సిలబడింది. ఆమె కదలక పోవడంచూచి, అత దుగ్రమూర్తి అయిపోయాడు.

వెళ్ళవేం ఇంకా?

వెళ్ళడానికి అభ్యంతరం లేదు. కాని...

కాని...

ఏ తప్పుచేయబట్టి నన్ను పొమ్మంటున్నారో తెలుసు కొని పోదామని...

అనుకుంటున్నావా?

అంతేబాబు.

ఏం తప్పా? నీకు తెలీదు?

తెలిస్తే అడిగేటంత అజ్ఞానదశలో మీదయవల్ల లేను.

అభివృద్ధిలోకొచ్చే మా అబ్బాయిని అన్ని విధాలా పాడుచేయడం తప్పుకాదూ?

కోటి చిరునవ్వు నవ్వింది.

బాబయ్యా! ఎంత పొరబడ్డారు? ఆయన నేనే పాడు చేయగలిగితే నా గర్వానికి మేరలేకపోయేది. బాబయ్యా! ఆయనను నేను కాదు—మీరు కాదు—తుదకు భగవంతుడు కూడా పాడుచెయ్యలేడు. ఆయన నిప్పుతునక. మావంటి గడ్డిపరకలు ఆ నిప్పుమీద పడితే కాలిపోతాం. కాని ఆ నిప్పు ఆరిపోదు.

ఇటువంటి మాటలవల్లే వాడు పాడయ్యాడు.

పొరబడుతున్నారు బాబయ్యగారూ! ఆయన పాడు కాలేదు. రోజులు గడుస్తున్నకొద్దీ ఆయన ఈ కుళ్ళు సంఘానికి దూరం అవుతున్నాడు. అంటే సత్యానికి, సత్య స్వరూపు డయిన భగవానునకు దగ్గరవుతున్నాడు. . . బాబయ్యా! ఆయన మన కుటుంబంలో పుట్టవలసిన వాడు కాదు, గాజురాళ్ళ మధ్య మణిపూసలా పుట్టాడు. ఆ మణిని తల ధరించడానికి మారు, రంపెట్టి కొట్టి ముక్కలు చెయ్యాలనుకుంటున్నాం. ఎన్ని ముక్కలు చేసినా మణికున్న ప్రకాశం తగ్గదు. అది గాజురాయి కాలేదు. . . మణి మణే; గాజురాయి గాజురాయే.

చాల్లే ఇంక మాట్లాడక.

చిత్తం. మీకు కోపం తెప్పించినందుకు క్షమించండి.

కోటి అతి వినయ విధేయతలతో రాంబ్రహ్మం పాదాలు ముట్టి, కళ్ళకద్దుకొని బయలుదేరింది. ఆ శాంతమూర్తి వెళ్లుతూంటే రాంబ్రహ్మం హృదయం ఝల్లు ఝల్లుమంది. కాని ఆమె ఇంట్లోనుంచి వెళ్ళిపోతేగాని తన భద్రం బాగుపడదనుకున్నాడు కాబట్టి మాటలాడలేకపోయాడు.

ఆమె మేడమెట్లు నెమ్మదిగా దిగిపోతూఉంది. ఆకాశంనిండా మబ్బులు; మెరుపులు. ఉరుములు.

ఆ అభాగిని ఇప్పుడు ఎక్కడకు వెడుతుంది.



ఆమె బయటకు వెడుతుంటే నిర్మల దగ్గరకొచ్చి కోటీ! ఎక్కడకు వెడతావే? అని అడిగింది.

ఈ జీవి తలదాచుకుంటానికి ఏ స్థలం నిర్ణయింపబడితే ఆ స్థలానికి. ఈ అనంతాకాశం క్రింద ఎన్ని చెట్లు తల దాచుకుంటంలేదూ? ఆ చెట్లలో ఏ చెట్టునీడయినా ఈకబో జపక్షికి చాల్దా నిర లా!

నిర్మల మాటాడలేపోయింది.

లోపలకు రమ్మనాలనుకుంది. కాని తండ్రి ఏమంటా డోఅనుకొని వణికిపోయింది

కోటి గుమ్మందాటి వీధిలో నిలబడింది.

మేడమీావనుంచి చూశాడు రాంబ్రహ్మం. కొడుకు పోలీసుస్టేషన్నుంచి వచ్చే వేళయింది. కోటి గుమ్మందగ్గర ఉంటే కొంపములుగుతుంది. ఆమె నెలాగై నా గెంటివేయా లనుకొని ఏనుగుగున్నలా మేడ మెట్లు దిగాడు. కోటి దగ్గ రకు వెళ్ళాడు.

ఏయ్! కోటీ! ఇంకా శనిలా గుమ్మంముందు నిలబ డ్డావే?

శని ఒక్కసారే పోతుందా?

ఎందుకింకా నిలబడ్డావ్?

వీధిబయిట విషయాలు మీాకెందుకు బాబయ్యా!

పొదలో పడివున్నపుడు పుణ్యమూర్తి కొరకు వెదుక్కున్నట్లే ఇప్పుడూ వెదుక్కుంటున్నా.

ఎవరా పుణ్యమూర్తి ?

మా భద్రం.

మీ భద్రం ! ! !

అతడుగుర్రైపోయాడు.

కాదా బాబయ్యా !

ఛా. ఆవలికిపో.

పోతా. ఆయనతో మాట్లాడే పోతా.

ఎందుకు ?

ఈ శరీరాన్ని చిన్నప్పటినుంచీ పెంచి, మీ రెలా పోషించారో—అలాగే నా లేత మనసునుకూడా ఆయన పెంచి పోషించాడు. నా మనసు నొక ప్రేమపంజరంలో పెట్టి ఆయనకు కానుక ఇస్తే—కన్నుల కద్దుకొని స్వీకరించాడు.

ఛా. ఊరుకో.

కోపించకండీ. ఉన్నా సంగతులు మీతో కాక ఎవరితో చెప్పుకుంటా . . . నాకు మన భద్రం లోకంయొక్క నిజ, స్వరూపాన్ని చూపిచాడు. ముసుగుతీసి సత్యంయొక్క నిజ స్వరూపాన్ని చూపించాడు. బుజ్జగిస్తూ విషయాలన్నీ బోధించాడు. ప్రేమించాడు; నాకు ప్రేమ నేర్పాడు. . . నన్నే. . .

ఓసి పశువా ! ఈ దాసీముండను ప్రేమించాడా ?

"చిత్రం. నేను దాసీని కానని, నన్ను మీరే దాసిగా చేశారని చెప్పాను.

కేవలుడు పెళ్ళి చేసుకొని రాణీని చేస్తానన్నాడా?

రాణీని చేస్తాననలేదు కానీ పెళ్ళిచేసుకుంటానన్నాడు.

పెళ్ళి కూడానా, ముష్టి.

అతడామె మీందకురికి, జుట్టుపట్టుకొని తన గుమ్మం మీద పడవేసి గొడ్డును బాదినట్లు బాదుతున్నాడు.

అంతలో దూరాన్నుంచి భద్రం చూశాడు. పరుగున వెళ్ళి తండ్రిని ఆపుజేశాడు.

నాన్నా!

ఏం?

ఏమిటీ దౌర్జన్యం?

దౌర్జన్యమా!

ఏమిటీ పశుత్వం?

పశుత్వమా!!!

కాదు; రాక్షసత్వం.

రాక్షసత్వమా! చండాలుడా?

భద్రం కళ్లు పచ్చబడేటట్లు తీపిపెట్టి ఒక లెంపకాయ కొట్టాడు. అంతలో నిర్మల ఏమిటిది నాన్నా! ఏమిటీ కోపం! అని అడ్డు వెళ్ళింది.

భద్రం తండ్రివంక జాలిగా చూశాడు, కోపం ఎలా

దిగమింగుకున్నాడో అతనికే తెలీదు. అతి శాంత గంభీర మూర్తి అయిపోయారు.

నాన్నా! ఇలా ఎన్ని దెబ్బలు కొట్టినా నేను విచారించను. పాపం! ఆ కోటి ఏం చేసింది?

ఏం చెయ్యాలి? నీవు పెళ్ళి చేసుకుంటావని సిగ్గు లేక చెప్పింది,

సిగ్గెందుకు? చేసుకుంటానని చెప్పాను; చేసుకుంటాను.

ఈ ఇంట్లో ఉండే.

కాకపోతే బయటుండి.

సిగ్గులేదూ?

చెడ్డపనికి సిగ్గు; మంచిపనికి సిగ్గెందుకు?

దాసీముండని పెళ్ళిచేసుకుంటం మంచిపనా?

దాసీ ముండేమిటి? అంద రాడవాళ్ళల్లాగా— అది పుట్టలేదూ? మీ ఇంట్లో పని చేయించుకుంటున్నారు కాబట్టి దాసీ అయింది. రేపు నేను పెళ్ళిచేసుకుంటే ఒక యింటికి ఇల్లాలు అవుతుంది. దానినే సింహాసనంమీద కూర్చోపెడితే రాణీ అవుతుంది. పొలంలో పనిచేయిస్తే రైతుబిడ్డ అవుతుంది. మిల్లుల్లో పనిచేయిస్తే కూలీ అవుతుంది...అంతేగా. పనినిబట్టి పేరు. మనిషినిబట్టి కాదుగా.



అయితే పెళ్ళిచేసుకుంటావా ?

తప్పక.

అపుడు నాయింట్లో ఉండటానికి వీల్లేదుసుమా!

అవశ్యం వెళ్ళిపోతా.

నీకు నా ఆస్తి ఏమీ పంచను సుమా ?

అలాగే. మీ ఆస్తి పంచకండి. కాని మన తాత తండ్రుల ఆస్తి పంచకుండా ఉండలేరుగా.

నీకు దేంట్లోనూ పూచిక పుల్ల ముట్టనీయను.

దానివల్ల నష్టం నాకు కాదు; కూలీలకు.

అదెలా ?

నాకేమైనా ఆస్తి వస్తే వారికొరకే ఖర్చుపెడతా లేదా...

ఊఁ

నేనే వాళ్ళకింద వినియోగపడతా.

ఏడిశావ్. పో.

మంచిది.

భద్రం మేడమెట్లెక్క పోతున్నాడు. భద్రానికి అడ్డు నిలబడ్డాడు రాంబ్రహ్మం.

భద్రీ. ఈ యింట్లోనుంచి పూచిక పుల్లతీసుకు వెళ్ళడానికి వీల్లేదు,

అలాగే. నా పుస్తకాలు...

ఏమీ మాట్లాడ్డానికి వీల్లేదు.

సరే.

రాంబ్రహ్మం నిప్పులు కక్కుతూ మేడెక్కిపోయాడు.

భద్రం తల్లీ చెల్లెండ్రు గొల్లుమన్నారు.

కొంత నిమిషాలు గడిచాయ్.

నిర్మల నెమ్మదిగా అన్నగారి పక్క నిలబడింది.

అన్నయ్యా! వెళ్ళవలసిందే

తప్పుతుందా తల్లీ!

నీగతే ఇలాగుంటే, రేపు నాగతి ఎలాగుంటుందో!

నీకేం?

నాకెవరో వృద్ధుని భర్తగా సిద్ధంచేశాడంట.

అమ్మా! పెళ్ళి ఒకరు చేశాది కాదమ్మా; ఎవరంతట వారు చేసుకొనేది. ఎవరి బాగోగులను వారే నిర్ణయించుకోవాలి తల్లీ! ఆత్మబలం ఉంటే—నీకు ఇష్టంలేని సంబంధం కుదిర్చి—బలవంతంగా ఏ తండ్రీ నీ తలవంచి అక్షింతలు వేయించలేదు.

అన్నయ్యా! నీవు ఉంటే కొంచం ధైర్యం ఉండేది.

అమ్మా! నాకంటే పెద్దవాడు నీ గుమ్మం దగ్గరే ఉన్నాడమ్మా!

'ఏవరన్నయ్యా!

'ఆ పెద్దకూతురి వాడే నమ్మా, భగవానుడు. నీలోనే వున్నాడు నీ వెంట ఉన్నాడు. ఎప్పుడు కావాలంటే అప్పుడు సిద్ధం. ఏది కావాలంటే అది చేసి పెడతాడు.

"ఆయనయందు నాకు నమ్మకం లేదన్నయ్యా;

'నమ్మకం లేకపోయినట్టే ఈపిరికితనం తల్లీ! నమ్ము; చెడిపోవు. నిర్మలా! ఒక్కమాట చెబుతా వినుతల్లీ! వివాహం జీవితంలో ఒకసారే అవుతుంది. పొరబడ్డావా, జన్మ జన్మంతా బాధపడాలి. తప్పదు. నీఇష్టంవచ్చిన వారినే నీవు చేసుకో. దానికి కావలసింది ఆస్తి కాదు, ఆత్మబలం.

నిర్మలా! నీకు ఆత్మబలం ఉంటే నీవు కోరినవారిని చేసుకోగలవు. చేసుకొని జన్మంతా సుఖించగలవు. లేకపోతే జన్మంతా దుఃఖమయమే. తప్పదు. నీవు ప్రేమించినవాడు నాకు తెలుసు. అతనినే చేసుకో.

నాకు ఆత్మబలం ఉన్నది కాబట్టే నేను ప్రేమించిన-ఈకోటిని పెళ్లిచేసుకోగలుతున్నా. గలుగులేకపోతే- చెప్పనా?

ఇదేనా సందేశం. తరువాత నీఇష్టం ఇంక మేం వెళ్లి వస్తాం...అంటూ తల్లివంక చూచి, అమ్మా! నాన్న మనసు శాంతించేటట్లు చల్లని మాటలు చెప్పు. మాకప్పులేమైనా ఉంటే క్షమించు. అమ్మా..." అంటూంటే అతని గొంతుకు బిగపట్టింది.

పాపం! కళ్ళమ్మట నీళ్ళుతిరిగాయ్.

కోటమ్మా నిర్మలలు వెక్కి-వెక్కి ఏడ్చారు.

తల్లిచెప్పనే అవసరంలేదు.

♦ ♦ ♦

కోటీ! పోదాం పద.

ఎక్కడకు!'

బయటకు

ఈవానలోనే!

'రెండుచినుకుల్లా- రెండు మెరుపుల్లా'

ఉరుముల్లా కాదూ!

ఎలాగో పద. 'పద."

ఇద్దరూ ఆకారు చీకటిలో ఆవర్షంలో బయలుదేరి వెళ్ళిపోతున్నారు—

ఎక్కడకు.

♦ ♦ ♦ ♦



భావాల్లో భేదం రాగానే బాంధవ్యంలో కూడా మనకు భేదం రావాలా ?

మానవులంతా ఒకలాగే పుట్టినా, ఒకలాగే చచ్చినా, పెరగడంలో మాత్రం వేరువేరు విధాలగా పెరుగుతున్నారు. అది పూర్వజన్మ సుకృత దుష్కృతాలమీదే ఆధారపడనీయండీ, ఈ జన్మ సుకృత దుష్కృతాల మీదే ఆధారపడనీయండి—మనం పెరిగే విధానాలు వేరు.

నదులన్నీ పర్వతాలమీదే పుడతాయ్. కాని వాటి ప్రవాహ వేగాలననుసరించే వాటి గౌరవాగౌరవాలు అలాగే మానవులంతా ఒకే విధంగా పుట్టినా వారి వారి మనోప్రవర్తనల ననుసరించే వారి వారి ఉన్నతి నీచత్వాలు.

మనసును బట్టే మనిషి. మనో వికాసాన్ననుసరించే భావ వికాసం. ఎవరి మనసు ననుసరించి వారి భావాలున్నపుడు, ఏ ఇద్దరి భావాలూ ఈ సృష్టిలో ఒక్కటి కాలేవు. అయినప్పుడు ఒకరి భావాలు మరొకరికి నచ్చనంతమాత్రాన వారిపై ద్వేషం ఎందుకు ? రోషం ఎందుకు ?

'We are one in kind, but very in degree. అని గాంధీమహాత్ముడు చెప్పినట్లు, మనం అంతా తత్వంలో ఒకటే —పరివర్తనంలో మాత్రం ఎంచుమించు తేడాల్లో ఉంటాం.

ఈ సత్యాన్ని అవగాహన చేసుకుంటే మన దేశం లోనే కాదు, ఏ దేశంలోకూడా మత కలహాలు కానీ, సాంఘిక విప్లవాలు కానీ, రాజకీయ దౌర్జన్యాలు కానీ జరగవు.

"నేను నీ పార్టీకి చెందనంత మాత్రంలో నీవు నన్ను నిందించడంలో అర్థంలేదు." అని రైటానరబుల్ శ్రీనివాస శాస్త్రిగారు చెప్పినట్లు—మన పార్టీలు వేరు కావచ్చును; అంతమాత్రంలో ఒకరిపై మరొకరు కత్తికట్టడంలో అర్థం లేదు.

"నీ పార్టీ వేరు నా పార్టీ వేరు కావచ్చు. నీలోనూ, నాలోనూ ఉన్న సూత్రాత్మ ఒక్కటే. వ్యావహారాంతరాళాలలో నున్న వ్యక్తిత్వాన్ని కలిపితే ఇద్దరూ స్నేహితులమే. రెండు తెగలూ పనిచేసేది ఒక్కదాని గురించే—అదే ప్రజాభ్యుదయం. ఇద్దరూ బలికాదలచినది ఒక్కదాని గురించే-అదే దేశస్వాతంత్ర్యం. మన మార్గాలు వేరు— మనసులొకటే. ఆశయాలు వేరు-ఆకాంక్షించేది దేశసౌభాగ్యమే" అని గ్రహించిననాడు, ఈనాడు మన దేశంలో ప్రధాన సంస్థలైన కాంగ్రెస్, కమ్యూనిస్టులుకూడా చేయీ చేయీ కలించి భాయీ భాయీ అని మనస్ఫూర్తిగా అనుకోగలవు.

అలా భావించడం లేదు కాబట్టే ఈ నాడు కాంగ్రెసు పక్షంనిచూసే కమ్యూనిస్టుకు ద్వేషం — కమ్యూనిస్టును

చూస్తే కాంగ్రెసు సభ్యులకు రోషం. పైకి భాయీ భాయీ అనుకుంటం; లోలోపల కుళ్ళు పెంచుకుంటం. ఇంతకంటే అధోగతి ఏముంది?

నలుగురూ కలిసిమెలిసి అన్నదమ్ములవలె మెలగడానికి మారాల. నలుగురూ వేర్వేరై ఒకరిపై ఒకరు కాలు దువ్వుతున్నారంటే—సంఘీభావం ఉంటుందా? సాంఘీభావంలేనిదే స్వాతంత్ర్యం అలవడుతుందా? స్వాతంత్ర్యం లేనిదే పరిజా పరిపీడన పోతుందా? ఆలోచించండి. అందరూ ఒకటి కండి. లేకపోతే ప్రజలను పతితులచేయడం, దేశాన్ని నాశనం చేయడం ఖాయం.

ఇబ్సన్ (Ibsen) మహాశయుడన్నట్లు "మనం వేసుకున్నా పక్కమీదే మనం పండుకుంటాం." మన చేతల ననుసరించే మన ఫలితాలు మన మనసును బట్టే మాటలు.

గడ్డిపరకలన్నైనా కలిసి పెనవేస్తే ఏనుగును బంధించగలం-ఏమంటారు?

మహాకవి మన గురజాడ అప్పారావుగారు చెప్పినట్లు:

"దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా.

వట్టి మాటలు కట్టిపెట్టోయ్,
గట్టి మేల్ తలపెట్టవోయ్;
పూని యేదైనాను ఒకమేల్
చేసి జనులకు చూపవోయ్.
మతం వేరైతేను ఏమోయ్,
మనసులొకటై మనుష్యులుంటే."



మీదపడే విమానాలను. బాంబులను, తుదకు ప్రళయబాంబులనైనా ఆపగలమేమోకాని, గడిచిపోయే కాలాన్ని ఆపలేం.

భద్రం ఇంట్లోనుంచి వెళ్ళిపోయి నాల్గు నెలలయింది. తన ఆశయాలేమీ మార్చుకోలేదు. తల్లిదండ్రులయందు భక్తి పోలేదు. దేశస్వాతంత్ర్యం ఆత్మీయ స్వాతంత్ర్యం మీదే ఆధారపడి ఉందనే ఆశయాన్ని విస్మరించలేదు.

రాంబ్రహ్మం [illegible] ద్వేషము చేసినా, కూలీలు మనుషులు కారని, [illegible] వాటి నుంచి నేటి వరకూ తన అభిప్రాయాలను మార్చుకోలేదు.

చిన్నప్పటినుంచీ తండ్రి రెక్కలపై ఆధారపడిన నిర్మల, అన్నగారెన్ని బోధించినా, స్వాతంత్ర్య భావాల

నలవరుచుకో లేపోతుంది. కాని అలవరుచుకోవాలనే ఆసక్తి మాత్రం పూర్తిగాఉండి.

ఇక రాంబ్రహ్మం భార్య–భర్త పదంటే అది. "దూ దూ బసవన్నా" అంటే "దు దూ బసవన్నా" అంటుంది. ఎక్కడున్నావే గొంగళీ అంటే, వేసిన చోటే ఉన్నానన్నట్లు—పుట్టిననాడే భావాలున్నాయో నేడూ ఆ భావాలే. కను బొమ్మలమీద వెంట్రుకల్లాగ పెరుగు తరుగుల్లేవు.

కోటి "కోటికి బాలుపో కుసుమ కోమలి నీవలె భారతావనిన్" అన్నట్లు విజ్ఞాన శిఖరం ముడుతూ ముడుతూ ఉంది.

తల్లిదండ్రు లొక్కలాగున్నారు.

నిర్మల మధ్యస్థంగా ఉంది.

భద్రం కోటమ్మలు ఉత్తమంగాఉన్నారు.

ఇలా వారు "అధమ - మధ్యమ-ఉత్తమ" స్థితుల్లో ఉన్నారు.



ఆరోజు ఏకాదశి.

పెళ్ళివారొచ్చి, పిల్లనుజూసి, రాంబ్రహ్మంతో కట్నా

లూ కానుకలూ విషయం మాట్లాడి, మాటిచ్చి లగ్నం నిశ్చయించి వెళ్ళారు.

ఇదంతా మన నిర్మలకు తెలీదు పాపం !

ఆ రాత్రి రాంబ్రహ్మం ఈ విషయం చెప్పడానికి మేడమీదకు పిలిపించాడు నిర్మలను,

నిర్మల వెళ్ళింది.

"కూర్చో తల్లీ కూర్చో"

ఆమె ఒక కుర్చీలో కూర్చుంది.

"నిర్మలా! నీవు చాలా అదృష్టవంతురాలవమ్మా!"

"ఏం? అన్నయ్య వస్తున్నాడా?"

ఆమె ఎంతో ఆత్రతతో అడిగింది.

"అబ్బా! ఇంక ఆగడుగాయిని మరిచిపో తల్లీ! వాడు నీతో పుట్టలేదే అనుకో.

పుట్టలేదు! పుట్టలేదు-" అనుకున్న కొద్దీ పుట్టాడు-పుట్టాడు' అనే సత్యం బలం అయిపోతుంది నాన్నా!"

"పోనీ వాడివిషయం ఈశుభవేళ మరిచిపో."

"పట్టప్పుడు ఏమైనా మరచిపోవడానికి వీలుంటుంది కానీ, ఆత్మబంధువులను అశుభానికి అభానికి మరచిపో గలమా?"

"ఇదిగో ప్రారంభించావు వాడిలా తండ్రిని ఎదురించడం."

అతడొక్కసారి గర్జించాడు.

ఆమె దానితో "దూదూబసవన్న" అయిపోయింది.

"నిర్మలా! నీవు ఎంత అదృష్టవంతురాలవు కాకపోతే లక్షాధికారుల ఇంటిలో పుట్టి. లక్షాధికారుల ఇంటిలో జీవితాంతం బ్రతుకుతావు!

"అంటే!"

'ఏముంది! లక్షాధికారిని వివాహం ఆడబోతున్నావు"

నేనాడబోతున్నానా అతడాడబోతున్నాడ.

"అతడే అనుకో.

"నాన్నా! అతగాడు లక్షలకు అధికారి కావచ్చును కాని నిర్మలకు అధికారి కాలేడునాన్నా."

"పెళ్ళిచేసుకుంటే ఎందుక్కాలేడు!

"నామనసు అతనిపై లగ్నంకాలేదుకాబట్టి; ఇక ముందుకాదు గాబట్టి"

"లగ్నంకాగానే మనసు లగ్నం అవుతుందిలే. ముందంతా ఇలాగే అంటారు. తరువాత—"

"నాన్నా! మీరు నన్ను చంపేసినాసరే నేనతడ్ని పెళ్లిచేసుకోలేను.'

'ఏం?"

"ఇంతకు ముందే మరొకడ్ని—"

"నిర్ణయించుకొన్నావా?"

"ఆఁ!'

"ఊహూఁ'

'... ... ..."

"ఎవరది?"

"ఎవరో ఇప్పుడు చెప్పను'

'నేను వింటే వెంటనే వద్దనేటంత స్వార్థపరుడా? కొంప తీసి ఏ నాటకగాడితో, ఏ పాటగాడితో, ఏ మోటకూరో వేసినవలలో పడలేదు కదా! ఆ వెధవొక దాసీదానిని చేసుకున్నాడు కదూ! నీవొక దాసీదానికి దాసీవాడినైనా చేసుకోవాలనుకుంటున్నావా?'

"... ..."

"మాటాడవే"

ఆమె గడగడలాడిపోతూంది.

“పిచ్చిపిచ్చిగా వాగకక ఇంటిలోకి వెళ్ళు. పిల్లకాకికేం తెలుసు ఉండేలదెబ్బ లోకంసంగతి! సుఖంపడాకూడదూ! చెడిపోయినవెధవచెడనేచెడ్డాడు. నీవుకూడా వాడిలా సిద్ధం అవుతావా ‘ముందొచ్చిన చెవులకంటే వెనకొచ్చిన కొమ్ములు వాడి” అన్నట్లు- జానెడున్నావో లేదో కానివాడికి బోధించ వచ్చావు. వెళ్లు వెళ్ళు. వాడెవడో చెప్పావుకాదు- సాయంకాలాని కల్లా చంపించి, తోటలో పాతించి, నీజ్ఞాపకార్థమై వాడిశవంమీద ఒకతులిసి మొక్క కూడా పాతించే వాణ్ని — ఏం

“నా—న్నా — అంతపని చెయ్యకండే.”

“మరి ఈసంబంధం ఒప్పుకుంటావా?

“— —”

‘నిర్మలా! ”

ఆమె కన్నీళ్లు జలజలా నేలపై జారిపోయాయి.

“వెళ్ళు.”

ఆమెమాట్లాడకుండా, కన్నీళ్ళయినా తుడుచుకోకుండా కోడెత్రాచులా జర్రుమని మెట్లమీదనుంచి జారిపోయింది.

తనగదిలోకి వెళ్ళి తలుపులు వేసుకొని పక్కమీదపడి వెక్కి వెక్కి ఏడ్వడం ప్రారంభించింది.

ఎంత ఏడుస్తే మాత్రం-ఆ స్వార్థ సింహం క్రూరదృష్టి కలనుంచి తప్పించుకోగలదా ?

ఇలా ఎంతమంది అభాగినులు ఆత్మబలం లేక నశిస్తు న్నారో !



## ౧౦

నిర్మల పెళ్ళింకా పది రోజులుంది.

పెళ్ళి పనులన్నీ అఖండంగా జరుగుతున్నాయ్.

నిర్మల తోటలోకి రోజూ వెళ్ళేది. ఒక్క రోజు కూడా రావన్నను చూడకుండా ఉండలేపోయేది. అటువంటి నిర్మల నాలుగు రోజులనుంచీ తోటలోకి వెళ్ళలేదు.

ఎలా వెళుతుంది ?

రావన్న ముఖం ఎలాచూస్తుంది ?

"నాన్నా ! నేను రావన్నను ప్రేమించా. రావన్నను తప్ప మరొకర్ని చేసుకోను." అని తండ్రితో చెప్పా లనుకుంది. కాని ఎక్కడ రావన్నను చంపిస్తాడో అని గడ గడలాడి పోయింది. బ్రతికుంటే రావన్నను ఎప్పుడైనా చూసుకోవచ్చునని కాని మాటాడలేదు.

"నా రాక సంగతి నా పిల్లవానికి తెలియకుండా ఉండదు. తెలిసి ఎంత బాధ పడతాడో! నన్నెంత ద్రోహిగా భావిస్తాడో!...నావియోగం భరించలేక ఏనుయ్యో గొయ్యో చూసుకోడుకద...ఏమో!...అయినా ఆ పిరికిపని ఆడవాళ్ళకు చెందింది. కాని మగవాళ్ళకు చెందలేదు...ఒక సారి వెళ్ళి జరిగినదంతా చెప్పుకుంటా" ననుకుంటూ సూర్యాస్తమయ సమయంలో తోటలోకి వెళ్ళింది.

మాసిన గడ్డం, చిరిగిన బట్టలు, అట్టకట్టిన తల, అప్పుడే అస్థిపంజరం అయ్యాడా అన్నట్లున్నాడు రామన్న. ఆమె హృదయం ఝల్లుమంది. సాయంకాలం ఎప్పుడూ పనిచేస్తూ ఉండేవాడు. ఆరోజు తోటలో మూలగావున్న ఒక ఉసిరిచెట్టు క్రింద పండుకున్నాడు.

అతని గమనించిచూస్తే తిండి తింటున్నట్లు లేదు. ఆమె కతని దీనస్థితి చూసేసరికి గుండెలు తరుక్కుపోయాయ్. కన్నీళ్ళు ధారాప్రవాహంగా కారిపోతూ ఉన్నాయ్.

వియోగంలో ఇంత బాధ ఉన్నదని ఆమె ఎప్పుడూ అనుకోలేదు.

"రామూ"

నెమ్మదిగా కన్నీళ్ళు తుడుచుకుంటూ పిలిచింది.

అతడు పలకలేదు.

"రా...మూ."

కళ్లు విప్పిచూచాడు.

'ఎవరది ?'

"నేనే...నీ. . ."

"నిర్మలవా !"

'అవును. నీ నిర్మలనే.'

అతడు చిరునవ్వు నవ్వుతూ లేచాడు.

'నిర్మలా ! ఈ నిర్భాగ్యుడింకా బ్రతికే ఉన్నాడా ?

ఆమె కన్నీళ్లు కార్చడం తప్ప ఇంకేమీ జవాబు చెప్పలేక పోయింది.

'నిర్మలా ! నిన్నెంత కష్టపెట్టాను.'

"నీవేం కష్టపెట్టావ్ ?"

"లేకపోతే ఈ కన్నీళ్లు . . ."

'నేను చేసిన తప్పునకే నేను ఏడ్చేది.'

తప్పుచేసి ఏడుస్తే లాభం ఏముంది నిర్మలా ?

"గుండె బరువైనా తగ్గుతుంది ఏడుస్తే.

'తగ్గితే లాభం ఏముంది ? చేసిన తప్పునకు శిక్ష ఆనందంతో స్వీకరించాలి. బరువెక్కిన గుండె బద్దలు కావాలి . . .'

'రాముం ! ఈ ద్రోహిని క్షమించగలవా ?'

"ద్రోహంచేస్తేకదూ క్షమించడానికి."

"నిన్ను పెళ్ళిచేసుకుంటానని ఇతరులను పెళ్ళి చేసుకుంటం ద్రోహంకాదా?"

"నీ ఇష్ట ప్రకారం చేసుకుంటే ద్రోహం... బలవంతంగా చేస్తూంటే నీవేంచేస్తావ్?

"నీకది తెలిసిందిగా..."

"ఆఁ"

"రామం! నిన్నుతప్ప మరొకర్ని పెళ్ళిచేసుకోనని చెప్పివేద్దామనుకున్నాను... అంతలో వాడెవరో చెబితే ఈపాటికి చంపించి, పాతించేవాడ్నే" అనేసరికి మాటాడలేపోయాను.

"ఎంతపని చేశావ్ నిర్మలా? నీవే చెప్పుంటే ఎంత బాగుండేది?"

"నిన్ను చంపేస్తే"

"నష్టం ఏముంది? ప్రేమకై నా జీవితాన్ని బలి చేసే దానికంటే ఆనందం ఏముంది! ఈ తోటలో ఏమూలో ఈ నా శవాన్ని పూడ్చివేస్తే—అక్కడకు ప్రతి రోజూవచ్చే నిన్ను చూస్తూంటే నా ఆత్మ ఎంత ఆనందించేదో..."

'ఏమిటో...'

'విచారించకు నిర్మలా! మిలమిలలాడే బంగారపుపై మెరుగులకే కరిగిపోయే ఈ స్వార్థమన శరీరాలను వేరు చేయగలిగిందే కాని, మన ఆత్మలను వేరు చెయ్యగలిగిందా?'

లేదు.

మనకింక విచారం ఎందుకు?

అయితే నీ విలాగై పోయావేం?

"ఆత్మశక్తి లేక."

అందుకనే నాకూ ఈ అధోగతి పట్టింది.'

దానికేమిట్లే. ఓడలు బళ్ళవుతున్నాయ్. బళ్ళు ఓడల తవుతున్నాయ్.

ఇద్దరూ అలా ఒకరినొకరు ఓదార్చుకున్నారు. చీకటి పడుతూ పడుతూ ఉంది.

"రామం! మరి నీమాట.'

నామాటేముంది?

"నీ పెళ్ళి'

"అయిందిగా,

ఎవరితో?

'సీతతో,

అతడు చిరునవ్వు నవ్వి 'పిచ్చిపిల్లా! వెళ్ళు. వెళ్ళు. ఈ రామం మరొకర్ని చేసుకోనేటంత కాముకుడు కాడు. అంటూ కళ్ళవంక చూచాడు.

ఆమెకు కితకితలు పెడుతున్నట్లయింది. అతను ప్రేమకు లోలోన నమస్కరించింది.

"రామం? వెళ్లిరానా?"

వెళ్ళిరా పెళ్ళికూతురా?"

అబ్బా, పెళ్ళిమాట ఎత్తక.

సరే. వెళ్ళిరా! నాపిచ్చి నిర్మల!

సరే. వెళ్ళిరా! నా పిచ్చినిర్మలా!

ఆమె నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళేప్రోవ నంకే చూస్తూ, రెండు నిట్టూర్పులు, నాలుగు కన్నీళ్లు విడిచాడు.

ఏమిటో! ప్రేమికా ప్రేమికుల జీవితాలెంత మాధుర్యరసన్నపితాలో, అంత బాధా పరివృతాలు.

ఆ రోజు పెళ్ళిరోజు.

వరుడు కేవలం వరడే. వయసు 50 సంవత్సరాలు మూడో పెళ్ళి. పేరు గణపతి. వృత్తి తినడం. నిదరపోవడం ఆస్తి లక్షరూపాయలు. విజ్ఞానం పూజ్యం. కీర్తిసున్న. దార్ఢ్యం మెండు. ఆయుష్షు అల్పం. ఒకసారి చూస్తే నరి పిశాచం రాగ జన్మ జన్మాలకు కలలోకి వస్తాడు.

ఇటువంటి ఉద్యోగస్తుల చేతిపట్టి కీలాగిస్తున్నారు. నిర్మలహృదయంగల నిర్మలా! ధనరాసుల చూచి అశాశ్వతమైన ధనరాసులు చూచి— ఆమె ఇత్తుక కోస్తున్నాడా తండ్రి,

అతను తండ్రా! భూలోక రాక్షసుడా!



ఎలాగైతేనేం ఆబలవంతపు పెళ్ళి జరిగింది. భద్రాన్ని పెళ్లికైనా పిలువలేదు— పెళ్ళిఅయిన తరువాత ఆగణపతి దేవుడు ఊరేగాలన్నారు— తప్పుతుందా! లక్షాధికారి శాసనం—

ఊరేగుతున్నారు.

ఆఊరేగింపు భద్రం ఇంటిముందునుంచి వెళుతుందని భద్రానికి తెలుసు. రెండుచక్కని జాజిపూల దండలు కట్టించాడు. ఊరేగింపుకోసం ఎదురుచూస్తూ ఉన్నాడు.

ఆపేద భద్రం ఇంటిముందు నిర్మలకారాగిందిభద్రం. దుఃఖం ఆగలేదు. అతడేం నేరంజేశాడని తన చెల్లిలపెళ్లికి వెలివేయబడ్డాడు.

'చెల్లీ'' అన్నాడు చేతిలో దండ గ్రుచ్చుకొని, అంత వరకూ కన్నులనిండిన కన్నీళ్ళు, అపిలుస్తూనే జలజలా చెక్కిళ్ళమీదనుంచి జారిపోయాయ్.

'అన్నయ్యా; అని ఆమె గొల్లుమంది.

"నిర్మలా!" అని కోటి గొల్లుమంది.

"కో...టీ—'అని నిర్మల బావురుమంది.

వాళ్ళ ఏడుపులుచూచి హృదయంగల డ్రైవరు కన్నీళ్ళు స్టీరింగుమీదే రాల్చాడు.

'చెల్లీ? నాన్న ఎంతపని చేశాడే! నాగొంతుకోయా లనుకున్నాడు. కాని చూసి చూసి నీగొంతుకే కోశాడే— నాగొంతుకోసినా బాగుండేది. ఈపాటికి పెళ్ళి చూడకుండా ఉండేవాణ్ణి. అంటూ చంటిపిల్లవాడ్లా ఏ పుస్తూదండ వేయబోయాడామె మెళ్లో కోటీకూడా వేయబోతూంది.

అంతలో జనాన్ని తోసుకుంటూ ముసలి విషసర్పంలా 'ఆగండి. ఆగండి. మీరు దండలు వేయడానికి వీలు లేదు...

మీరు పాపాత్ములు. ఖరగ్గిలు' అంటూ నాన్న హస్తం వారిచేతుల్లోనుంచీ, దండలు లాక్కొని ముక్కలు ముక్కలు చేశాడు.

భద్రం తలనరికి నట్లయింది.

నాన్నా! ఈపెళ్లికి వేయకపోతే రెండో పెళ్లికి వేస్తా లెండి—"

'రెండో పెళ్ళెవరికి?'

'నిర్మలకు.'

"ఎవరితో"

"ఆమె ఇష్టం వచ్చినవానితో"

'భర్త బ్రతికుండగానే—'

'కాదు చచ్చింతరువాత"

పెళ్ళికొడుకదిరి పడ్డాడు.

'రాంబ్రహ్మం రుద్రమూర్తి అయిపోయాడు.

'భద్రం జాగ్రత. పేగులు తీయిస్తా."

'చాలు సంతోషిస్తా"

'చెల్లెల శుభం కోరడానికి బదులు ముండకమ్మంటావు. అది నీకేంచేసింది అపకారం-'

'ఏ అపకారం చెయ్యకపోతే బలవంతంగా దాని మెడ విరిచి మంగళసూత్రం ఈమూడుకాళ్ళ ముదుసలిచే కట్టిస్తావు! కాటికి కాళ్లుసాచిన ఈముసలి పీనుక్కు అంటకట్టి 'ముండవుకా' అని శాసించింది మీరు—పీడుచావగానే మరొకడ్నిచేసి 'ముత్తయిదువుకా తల్లీ' అని దీవించేది నేను'

'నీవు బ్రతికుంటేగా'

"నేను చచ్చినా; మహాత్ములు చావలేరు. నా ఆత్మ బలం చావలేదు- నాఆత్మ శక్తే దాన్ని సుసుంగళిని చేయిస్తూంది...'

ఏడిశావులే...డబ్బియిచరు పోసియ్, పోనియ్!

కారు వెళ్ళిపోతూంది.

"నాన్నా! మీరు ముక్కలు చేసిందిపూలదండలను కాదు, మాలేతహృదయాలను మరచిపోకండి. కన్నా సంతా నాన్ని వలవల ఏడ్పించే తండ్రికంటే మహాపాతకి ఉంటాడని మరచిపోకండి. నాకిది జయంకాదు సుమా! ఆడకూతురు కన్నీళ్లు ఇంటిలో రాలకూడదు సుమా; అంటూ ఉంటే ఊరేగింపు వెళ్ళిపోతూంది.

నిర్మల మాట చెప్పలేను.

నిగ్రహించగల అన్న ఉన్నాడనే మన 'డబ్బునాగన్న" గణపతి దేవుడు కాలేడు.

భయంతో కోటీ ఇంట్లోకి వెళ్లి జీవచ్ఛవాల్లాగ ఒకమూల కూలిపోయారు.

ఊరేగింపు ఆ సందు మలుపుతిరిగింది.

'ఇదిగో! అతడికీ మీ బాబుకీ యిరోదమూ! అన్నా డు గణపతి అన్యాయం

"ఛా! ఊరుకో!'

అన్నది నిర్మల అసహ్యంతో.

ఇదిగో! నీకు నేనేటి లోటు సేశానూ?

నేనంటే యెందుకా యెదవకోపం"

పిచ్చిపిచ్చిగా పేలావంటే గుండెల్లో గుద్ది చంపుతా.

అందుకే నేటి పెళ్ళిచేసుకుంది.

ఇంకెందుకు?

సుకిత్తానికాగూ!

చచ్చినప్పుడు సుఖిస్తావుగానిలే.

అదేటీ! నీకింత ఇష్టంలేదంటే నేనెందుకు చేసుకుంటాను?

నన్నడక్కపోయావా!

తప్పే. బుద్ధి గడ్డితింది.

అంచేతే అనుభవించు.

తప్పుతుందా మరి.

ఇంక అసహ్యంగా మాట్లాడక.

సిత్తం.

వాళ్ల గుసగుసలు వింటూన్న డ్రైవరు లోలోన నవ్వుకున్నాడు.

వీడు చావగానే మరొకడికిచ్చి ముత్తయిదువునుచేస్తా నన్న అన్నగారిమాటలకు కొంత ఊరటచెందింది నిర్మలకు. అన్నగారిని చూడగానే ఎక్కడలేని ఆత్మబలం కలిగింది. ఇంక ఆముసలివానికి ఉద్వాసంచెప్పి, తన రావన్నతో ఆనందం అనుభవించాలని నిశ్చయించుకొంది. ఆత్మబలంలేనివాళ్ల కన్నీ కష్టాలే అని నిర్ణయించుకొంది.

ఊరేగింపు ఇంటికి జేరింది. అమర్నాడే కార్యం.

అమర్నాడు గుండెలోనొప్పి అని మంచం ఎక్కింది. ఎంతమందిచెప్పినా ససేమిరా వినలేదు తరువాతఅత్తవారింటికి బయలుదేరమన్నారు. అట్టి మాట్లాడుతే మంగళసూత్రం నల్లపూసలూ పటుక్కని తెంపి పోగుపెడతానందే కాని, అత్తవారింటికి వెళ్లడానికి ఒప్పుకోలేదు.

తండ్రివచ్చి సింహగర్జనలు చేశాడు. ఆమె మాట్లాడకుండా లోపలకు వెళ్లి ఒకకత్తిపీట తీసుకొచ్చి తండ్రికిచ్చింది.

ఎందుకిది?

ఝూడ నరకడానికి,

॥౯

ఏమ్మాటలివి?

ఉన్నా ఒక్కకొడుకునీ ఇంట్లోనుంచి గెంటివేశారు. మిగిలిన నన్నుంచడం ఎందుకు! మెడపరికి యమపురికి పాత కాపునిచెయ్యండి- మీ శనీ, నా శనీ కూడా విరగడైపోతుంది! అని ఉగ్రరూపిణిఅయి నిప్పులు కక్కింది.

నలుగురిముందూ అతడు సిగ్గుపడిపోయాడు.

ఏంచేస్తాడు?

చచ్చినట్లుపోయి - వియ్యాలవారి కాళ్లూచేతులూ పట్టుకొని - అమ్మాయిని తరువాత పంపుతానని ఒప్పించి పంపించాడు.



శని విరగడైనట్లు పెళ్లివారంతా వెళ్లిపోయారు.

నిర్మల తనమెళ్లో వేళ్ళాడే పుస్తె తెంపివేసింది. చక్కగా తలారా స్నానంచేసి, కొత్తబట్టలు వేసుకొని రతీ దేవిలా తోటలోకి వెళ్ళింది.

ఆనందంతో అన్నిసంగతులూ చెప్పింది రావన్నతో- వారిద్దరిఆనందం వర్ణనాతీతం. అంతేపండును కోసుకునేదాని

కంటే. అందనిపండును శ్రమపడి కోసుకోగలిగితే వచ్చే ఆనందం చెప్పలేం.



నెలతిరగలేదు—గణపతి పాపం క్షయవల్ల కాలం చేశాడని తెలిసింది.



పోయిన కట్నానికీ, అయినఖర్చుకు, జరిగిన పరాభవానికీ, తిన్నతిట్లుకూ సిగ్గుపడి బిగుసుకుపోయి మంచంపట్టాడు రాంబ్రహ్మం.

ఆసాయంకాలం తోటలో ఆడుకుంటూ పాడుకుంటూ విచ్చలవిడిగా తిరుగుతున్నారు మన నిర్మలా రావన్నలు.

తిరిగి తిరిగీ ఆలసిపోయి పారుజాతపుచెట్టుకు ఆనుకొని కూర్చున్నారు.

వారివెనుకే అటు కోటమ్మా, ఇటు భద్రం చెరొక పూలదండా పట్టుకొని సిద్ధం అయ్యారు.

వారిని చూచి ఉలుక్కుపడి లేచారీకొత్త ప్రియులు-

'నిర్మలా? ఇదిగో ఇది నీ దామం మెడలో వెయ్యి''

అన్నగారి ఆజ్ఞప్రకారం ఆనందంతో నిర్మల రావన్న మెళ్లో దండ వేసింది.

"రామూ! ఇదిగో ఈ కుంకుమబొట్టు పెట్టి, ఈదండతో ఆమెనలంకరించు.

కోటమ్మ ఆజ్ఞ నిర్వర్తించాడా ప్రేమపూజారి రావన్న—

ఏవోయ్! రావా! పెళ్లయిందిగా. ఇంక మాయింటికి పోదాంరండి. ఆత్మస్వాతంత్ర్యం లేనివారు దేశస్వాతంత్ర్యాన్ని సంపాదించలేరు. దేశభక్తులకు మొట్టమొదట కావలసింది ఆత్మస్వాతంత్ర్యం. ఆతరువాతే దేశస్వాతంత్ర్యాన్ని సంపాదించ గలరు తెలిసిందా.

చెల్లమ్మా! ఆత్మస్వాతంత్ర్యంలో ఉన్న ఆనందం ఇప్పటికైనా అర్థం అయిందా?

ఓ! కాకే.

అంతా కిలకిల్లాడుతూ—పకపకనవ్వుతూ, చటపటాలు వేసుకొని భద్రం ఇల్లు చేరారు.

## దేశస్వతంత్రం

ఆత్మస్వాతంత్ర్యంమీద ఆధారపడిఉంది
అని మరచిపోకండే'

'ఊటామ'



Srinivas press, R.j.y. E, G 38 11-1-46 750